131





LAKSHMI VILAS
TELUGU
READING BOOKS.

# MIRABHAI.



N. Chalapati Rau.

Grade II.



M. V. Press, Ellore.



శ్రీరస్తు.

# మీ రా బా యి

## మొదటి ప్రకరణము.



రాజపుత్రస్థానము మనదేశములో వీరులకు నివాసమని చెప్పుదురు. అందులోని మీవారురాష్ట్రములో మహావీరుఁడగు మహారాణా రాచఱికము సేయుచుండెను. మీవారురాష్ట్రమునకుఁ జిత్తూరురాజధాని. ఆపట్టణముచూడ సొంపుగానుండును. ఆపట్టణమునందే వీరమాతలు దమమానమును గాపాడుకొనుటకై ప్రాణములను ధారవోసినారు. అచ్చటివీరమాతలు పాతివ్రత్యము నొకచేతిలోను, ప్రాణము నొకచేతిలోను బెట్టుకొని పాతివ్రత్యము నెవఁడైన భంగముచేయఁజూచినప్పుడు ప్రాణమును గడ్డిపరకను విడిచిపెట్టినట్లు నిర్లక్ష్యముతో విడిచిపెట్టుచువచ్చిరి.

మహారాణా శౌర్యప్రతాపములు దేశమంతము మ్రోఁగి పోవుచుండెను. ఆదినములలోఁ బౌరుషము సవారింటనే పుట్టినది యని జనులనుకొనుచుందురు.

ఆమహారాణాకు సుపుత్త్రుఁడు గలిగెను. సింహామునకుపుట్ట సింహపుపిల్లయే పుట్టునుగదా! ఆచిన్నబిడ్డ సకలవిద్యలు నేర్చుకొని ప్రతాపవంతుడై వెలుఁగుచున్నాఁడు. ధనుర్విద్యయందెంత ప్రవీణుఁడో సాహిత్యమునందు నంతప్రవీణుఁడు. పండితులు, సూ

రులుగూడ నతనివెంటనంటి తిరుగుచుందురు.

రాజకుమారరాణా దినదినము తనసుగుణసంపదచేత దేశదేశములయందుఁ బొగడఁబడుచుండెను.

యౌవనవంతుఁడైన రాజకుమారునకు వివాహముసేయు సమయము తటస్థించెను.

సకలకల్యాణగుణయగు చిన్నది మీరాబాయికలదు! ఆమెయే యీతనికిఁ దగినచిన్నది. అని యాయిరువురినిఁ జూచిన వారెల్లరు చెప్పసాఁగిరి.

"మీరాబాయి" అంతమంచిదా కనుఁగొందమని మహారాణా బయలుదేరి పోవుచుండెను. పోవుచుండఁగా దారిలో గొడ్లనుకాఁచు గొల్లపిల్లలు భజనమందిరములలోని దైవభక్తులు, వీరువారననేల? ఒకరుగాదు. అందఱు, మీరాబాయిచేసిన కీర్తనములే పాడుచుండిరి. ఆసంకీర్తనముచేసినచోట దైవము తాండవమాడుచుండును. ఆమెఁగూర్చిన వర్ణసముదాయమునందేమి మహాత్త్వమున్నదో ఆమె వాక్కునఁ బిలువఁగా దైవము "ఓహో" యని పలుకుచుండును. దేవుఁడు భక్తజనవశ్యుఁడుగదా!

మీరాబాయియింటికేఁగిరి. సౌధమున తంబూర చేతఁగొని సంకీర్తనముచేయుచు విద్యుద్దీపమువలె వెలుంగుచున్న తేజోరాశియగు మీరాబాయిని సర్వాంగసుందరమూర్తినిఁ జూచిరి.

ఆదినములలో మగపిల్లవానితండ్రి యాడుబిడ్డయింటికి వెళ్లి పిల్లనిమ్మని యడుగుట మర్యాద.

మహారాణా యార్యసంతతిలోనివాఁడు. ఆర్యమతాచారములను భక్తిశ్రద్ధలతో నడపువాఁడు గనుక మీరాబాయి జనకునిఁ జూచి నమస్కరించి "మీఅమ్మాయిని మాఅబ్బాయికిచ్చి పెండ్లిచేయించి నన్ను కృతార్థుని గావించండి" అని యడిగెను.

లోకప్రసిద్ధుఁడగు మహారాణావంటి మహావీరునితో వియ్యముచే యుటకెవ్వరుపొంగరు. రాజకుమారరాణా సకలవిద్యాకోవిదుఁ డని పరాక్రమవంతుఁడని యప్పటికప్పుడే రాజపుత్రస్థానమంతయు నాతనికీర్తి వ్యాపించియుండెను. వివేకవతియగు మీరాబాయి యేమనునోయని జనకుఁడు విచారింపనెంచి కాఁబోలా మొగదిలో నికి బోయెను. అప్పటికప్పుడే యీయుదంతమును వినిన మీరా బాయి వినమ్రమయయి తండ్రికి నమస్కరించి "నాన్నగారు, మీరు నన్నడగవలెనా, మీకంటె నాకేమి తెలియును? మీకేదియిష్టమో నాకు నదియే మహావర"మనియెను.

ఔరా! మీరాబాయి యోగ్యత జనకుఁడామాటలు విని పులకితాంగుఁడై 'నాబిడ్డ పుట్టినింటికి న త్తింటికి వన్నెఁదెచ్చును' అని యనుకొని గాఁబోలు సంతోషాశ్రువులతో "సరే" యని గదినుండి వెడలెను.

"మీరాబాయి తనకు కోడలగునంత యైశ్వర్యముపట్టు నా" యని తహతహపడుచున్న మహారాణా కాఁబోవు వియ్యం కుని ప్రసన్నవదనమును జూచి సంబరపడెను.

"ఎప్పుడు సుముహూర్తము నిశ్చయించినార"ని మహా రాణా యడిగెను.

"ఆపని మీయందున్నది. మేమాఁడుపిల్లవాండ్రము. మీ రెప్పుడు దలఁచిననప్పుడే కావచ్చున"ని యాతఁడు నమ్రత దీనతఁ దోచునటులఁ బలికెను.

మహారాణావంటి ధీరోదాత్తుఁడితరుల దీనతను సహించు నా తత్క్షణమే. వివాహకార్యము మీయధీనము మీయిష్టమువ చ్చినట్టు నడచుటయే ధర్మము. మీరెప్పుడు రమ్మనిన మేమప్పుడు రావలసినవారమనెను.

# మీ రా బా యి.

## రెండవ ప్రకరణము.

కొన్ని దినములకు సకలవైభవములతోఁ బెండ్లియాయెను. దంపతులిరువురు పూవుతావివలె వస్తువుపేరువలె కలిసిమెలసి సంసారమును జరుపుచుండిరి.

ఇరువురు కవులు. ఇరువురును గవితారసము గ్రుమ్మరించి సరసప్రపంచమును వశముచేసికొనుచున్నారు. ఒకరువ్రాసినకొఱ తను మఱియొకరు పూర్తిచేయుదురు. భర్తసమస్యను భార్య కవిహృదయము నెఱిఁగి పూర్తిచేయును. ఇట్లు దినములు గడచుచుండెను.

మహారాణా పరలోకమునకుఁ బోయెను. రాజకుమారరాణా రాచఱికమునకు వచ్చెను. మీరాబాయి "మీవారురాణి" యాయెను. ఇరువురికవిత్వము మారుచుండెను. రాణాకవితసాహిత్యమును శాసించుచుండెను. మీరాకవిత గగనమును చింపుకొని భాస్కరతేజస్సును దాఁటి దిక్కాలబద్ధముగాని యంతరాళమును జొచ్చుచుండెను. అక్కడనుండి ధర్మమును స్థాపించుటకై యవతారమెత్తిన శ్రీకృష్ణుని వెన్నంటెను. బృందావనమునయున్న గోపాలునియందు శరణుఁజొచ్చెను. ఒక్కసారి యారుచిమరఁగెను. ఇఁక విడిచిపెట్టలేకపోయెను. శ్రీకృష్ణుని సేవయందే వాస్తవమైన యానందము కలదని కనుఁగొనెను. తానొక గోపికవలె శ్రీకృష్ణుని యారాధించెను. శ్రీకృష్ణపరమాత్మరూపము ధారణచేసెను. శ్రీకృష్ణనామమును స్మరించెను. తానాతనియందే నిమగ్నయాయెను.

కాలము గడచెను. రాజ్యభారమంతకంత కధికమాయెను. పతికి మంత్రివలె నాలోచనము చెప్పవలయును. ప్రజల పాలించవలయును. లోకము పాటికనుఁగొనవలయునుగదా మీరాభాయికంతకంతకు దైవధ్యాన మెక్కువయాయెను. శ్రీకృష్ణపదధ్యానాసక్తి యామెను శ్రీకృష్ణునితోఁబాటు లోకములన్నిఁటినిఁ ద్రిప్పుచుండెను. ఐహికవిషయములందుదాసీనత యేర్పడెను. క్రమముగా వైరాగ్యము జనించెను. అనుదినము శ్రీకృష్ణగీతములను బాడును అస్వరమాధుర్యము! ఆలలితపదశైలి! ఆవర్ణసమాసమహత్త్వము! వినినవారినెల్లఁ బులకాంకితులను జేసి భక్తులను గావించును. ఆమెకిన్నరస్వరము ప్రణవమువలె పవిత్రమై వాయువునే పూతమొనర్చుచుండెను. ఆపాటకంటె నాపాట నామెట్టుకంటె నామెట్టు గమ్యస్థానమునకు దగ్గరచేరినట్లు దైవసన్నిధికి దారితీయుచుండెను.

క్షణక్షణము శతసహస్రాదికవిధముల పెరుఁగుచున్న శ్రీకృష్ణునియందలి యనురాగము చిత్తూరుకోటలో బంధింపఁబడియుంచుట కెనసితరము! ప్రపంచమంతటను దైవమునుగాంచు శరీరికి నిర్బంధము దుస్సహముగదా. అనుదినము శ్రీకృష్ణాలయమునకు బోయి యాదివ్యమంగళుని సంకీర్తనము చేసి పరవశమై నిద్రించును. పరవశగాను దైవవశమై తన్మయత్వమును బొందును

ఆమెగానమును వినినవారు వందలు వేలు మనస్సుకరిగి దైవభక్తులు కాఁజొచ్చిరి. మీరా యనుదినముగుడికిఁబోయి దైవసంకీర్తనము ప్రణవమాదు లినముచున్నట్లు పాడి దైవవశయగుచుండెను. ఈమహాభక్తురాలివార్త క్రమముగా దేశములయందు వ్యాపించెను. ఆమె రాణివాసమునుండి దేవాలయవాసమున కలవాటుపడుచునుండెను.

ఈవార్త గంధవహమగు మలయపవనమువలెఁ జల్లఁగా వ్యాపించి జనుల నానందపఱచుచు, మొగలుప్రభువులలోనికెల్ల మహామతుఁడును దైవభక్తుఁడును, సర్వజనసేవ్యుఁడును, కవియు, విష్ణువునగు ఢిల్లీచక్రవర్తి అక్బరు నానందపఱచెను.

ఆనాఁడు ఢిల్లీరాజ్యము సకలకళలకునిధి. సాహిత్యమునకు తల్లి. సకలమతములకు మూలస్థానముగదా. అక్బరుచక్రవర్తి కవియగుటచేఁ బరహృదయవేదియై సరసవచనచాతురిచేఁ బండితులను జ్ఞానులను వశపఱచుకొనుచుండెను.

మీరానారీ వాక్సుధారసముఁగ్రోలవలెననియు, నాబోధచే తరింపవలయునని తలపోసెను. చక్రవర్తుల చెడ్డతలంపులైనను కొనసాఁగుటకు వీలుగలదు. ఇక మంచితలంపు నెఱవేరదా నెఱవేరుట కడ్డేమికలదు.

రాజపుత్రస్థానము సామాన్యరాష్ట్రములవంటిదిగాదు. అచటినాయకులు ధీరోదాత్తులు. స్త్రీలు వీరమాతలు. స్వాతంత్ర్యము మానము వారికిప్రాణముకంటె నెక్కువనస్తుపులు. అదిగాక పద్మినిఁజూడఁగోరిన అల్లాఉద్దీన్ప్రభువునకు జరిగినపరాభవము మఱపునకు వచ్చునదిగాదుగదా. అందులకై జరిగిన సాధుస్త్రీల బలవంతమైన ప్రాణత్యాగములు తలఁచుకొనిన ఒడలు జలదరించును.

హిందువుల యాత్మగౌరవము కఠిననియమముగలది. దానిని గాయపఱచిన త్రాచువలె నొక్కమాటు బుస్సుమనును. రాజపుత్రస్థానమందు విరోధాగ్ని పుట్టినా యది చల్లార్చుట సుకరముగాదు.

వివేకవంతుఁడగు నక్బరుచక్రవర్తి యీవిషయములనన్నిఁటినిఁ దలపోసి, శాంతినికేతనము గావున టానుసేనుఁడను నాస్థానగా

యకుని బిలిచి, ఆమహాదేవిగానముఖమునకు దైవస్వరమును వినుట కుపాయము చెప్పుమని యడిగెను.

తానుసేను డప్పటిగాయకులలో మనస్సు మచ్చుజల్లి మత్తుగొల్పు గారడివాడని పేరుపొందినవాడు. ఆతనికిని మీరాగానమునువిని దేవదర్శనము జేయుట యెప్పుడెప్పుడని మనస్సువిఘ్వరుచుండెను. గాయకుడాలోచించి భిక్షుకులరూపమున నాదేవాలయమునకు బోయి యామహాసాధ్విగానమును వినవచ్చునని యుపాయము చెప్పెను.

ముష్టిహాంద్రవలె చక్రవర్తియు గాయకుడును బయలుదేరి మీరారుచేరి యచట ప్రణవస్వరము నాలాపించుచు తన్మయత్వము నొందుచున్న మీరాబాయిని నేత్రపర్వముగ జన్మ తరించునట్లుల సందర్శించిరి. చక్రవర్తి పరవశుడై ఆమెపాదములపైబడి "మాతా! నాజన్మతరించుమార్గము నుపదేశించుము. నన్ను రక్షించుము" అని దీనుడై వేడుకొనెను ఆమెవానివంకజూచెను.

ఆచూపుస్వర్గమునుండి వచ్చిన దివ్యతేజస్సువలె నాతని దన్మయుని గావించెను. చక్రవర్తి తనమెడలో జొక్కాక్రిందనున్న వజ్రహారమునుదీసి యామెకిచ్చి దీనిని నీదేవున కలంకరించుము. నన్ను కృతార్థుని గావింపుమని బతిమాలెను.

మీరా దానిని జూచి 'ఓయి అధికమూల్యముగల దీనిని భిక్షుకుడవువలెగాన్పించు నీకెక్కడిది' అని యడుగగా నాతడమ్మా. ఇది నర్మదలో స్నానముచేయుచుండగా దొరికినది. దైవార్పణము చేయుటకంటె మంచిపనిలేదని దీనిని మీకర్పణము చేసితిననెను.

ఆమె వారిని దీవించెను. వారు కృతార్థులై ఢిల్లీకి ప్రయాణమైపోయిరి.

# మీ రా బా యి.

## మూడవ ప్రకరణము.

వజ్రహారము మీరాకురిత్రాడాయెను. ఆమె సంసారము ను ఛేదించుటకు గండ్రగొడ్డలియాయెను. దాంపత్యవృక్షమునకు వేరుపురుగాయెను. ఆమెపతియందీహారరుచులు క్రోధాగ్నిని బ్రజ్వలింపఁజేసెను.

ఆవజ్రహారదీధితులు దేశమంత వ్యాపించి ఆకారమును ధరించి శ్రీకృష్ణుని సందర్శింపఁజేసెను. ఆవజ్రములకు విలువలేదు. విలువఁగట్టఁగలవాఁడునులేఁడు. రాజపుత్రస్థానము వజ్రధారణము నందు ప్రసిద్ధిగలది. అచటివారు విచారింపఁగా విచారింపఁగానిది అగ్బరుచక్రవర్తికమ్మఁబడినదని తెలిసికొనిరి. అటుపిమ్మట భిక్షకులుగావచ్చినవారిలో అగ్బరుపాదుషా యొకఁడనియు తెలియవచ్చెను. కపటవేషము చిరకాలము దాఁగునా.

రాజకుమారరాణా కిదియంతయుఁ దెలిసెను. అగ్బరుపాదుషా తనరాణినిఁ జూచెను. వజ్రహారము నిచ్చునెపమునఁ గరస్పర్శము గావించెను. ఇంక గౌరవమెక్కడిది! నేటితో రాజపుత్రస్థానపుప్రతిష్ఠభ్రష్టమైనది. ఇఁకమీరారాణి అపవిత్రమైనది. పాడైనది. మీవారవంశప్రతిష్ఠనాశనమైనది. పతితురాలగు స్త్రీకి మరణమే యుచితదండనము కోపాగ్నిచే రుద్రమూర్తియైన రాణా మీరానుజంపుమని యాజ్ఞయిచ్చెను. కాని యారాజసేవకులెవ్వరు నామెను జంపుటకుఁ జేయెత్తలేకపోయిరి. చంపుమనవచ్చినవాఁడెల్ల నెదుటికివచ్చి చేయాడక వెనుకకు మరలెను. తుదకురాణా

మరణవార్తను వ్రాసి యాదండనము నామెయే విధించుకొనవల సినదని వ్రాసెను. ఆచెల్లుచీటి యామె దైవప్రార్థనము చేసికొని గుడినుండి వచ్చునప్పుడతిభయముతో గడగడవడఁకుచు సేవకుఁడా కఁడామెచేతిలోఁ బెట్టెను.

ఆమె యది చదివికొనిచూచి తాను రాజాను జూడవ చ్చునా యని యడిగెను. "రాణీ! తమకిచ్చిన కాకితములో రాజాగారు తమ్ముఁజూచుటకు వలనుపడద"ని వ్రాసియున్నారని గద్గదికతో ననెను.

"హిందూస్త్రీ భర్తయాజ్ఞ ననువర్తింపవలయును" అని మాత్రమే మీరాపల్కినవాక్యము. ఆమెతో నెప్పుడును వందలకొలఁది భక్తులుందురు. వారలకీవార్త దెలిసిన సంక్షోభము పుట్టు నని యామె యెఱుఁగును గావున నెవ్వరికినిఁ జెప్పదు. మరణము నకు సిద్ధపడుచుండెను.

రాణి నుస్తులు విడిచి పసుపులోముంచిన ప్రాతచినికి బట్ట కట్టుకొనెను. ప్రొద్దుగ్రుంకినది మొదలు నిశీథసమయమును నిరీక్షించుచుండెను. ఇంక నిశీథముకాలేదా యని నక్షత్రములను జూచుచుండెను. నక్షత్రములామెభావమును గన్గొని యిదే నిశీథమనెను. ఏమానంతోషము? మీరా చిదానందమగ్నయై బయలుదేరెను. తేజఃపుంజమే నడలుచున్నది యనిపించెను. అందరును నిద్రాముద్రితులైరి. నదీతటమునకు వచ్చెను. నర్మద మహాప్రవాహవేగమున సప్తస్వరముల మేళగించి గానముచేయు చు, యుద్బోధనమొనరించుచుఁ దరంగపరంపరావిలసితయై యిరు తటములు ప్రోసి యెగయుచుండెను. మీరా నర్మదాగానమును శ్రుతిఁజేసికొని కన్నులుమూసికొని విలుప్తమై రాగపరంపరల దుమి కించు స్వరగానము నాలాపించి శ్రీకృష్ణపదారవిందధ్యానైకచిత్త

మై నదీమధ్యమున కొక్కసారిగా దుమికెను. దుమికెనుగదా! ఏమిజఱిగెను. దైవతేజస్సు యెదుటఁ బ్రత్యక్షమాయెను. మనః కల్పితతేజస్సుగాదు. భ్రమాభాసమగు విద్యుద్దీపముగాదు. కల లోని తేజఃపుంజముగాదు. నేత్రపర్వముగ దివ్యతేజస్సు దివ్యతే జస్సే ఎట్టయెదుట ప్రత్యక్షమాయెను. అది నరభావాకృతిఁదా ల్చి నమ్రీభూతమై మీరాను స్పృశించి యనెనుగదా—"మీరా! నీపతియాజ్ఞను నెరవేర్చితివి. నీవు మరణించితివి. కాని నీవొనర్ప వలసిన ఘనకార్యమొకటి మిగిలియున్నది. ఆశేషకార్యము నిన్నా సందేశముకొఱకు నిర్మించుచున్నది. లేప్రపంచమునకు జ్ఞానోపదే శినివిగమ్ము"

---

# మీ రా బా యి

## నాలవ ప్రకరణము.

మీరా యీదివ్యవాక్కువిని కన్నులుతెఱచెను. చూచు నుగదా మధ్యాహ్నమైనది. ఎండ కుంభద్రోణముగాఁగిరణములను గురియుచున్నది. నదీతటముననున్నది. ఇదే దైవసందేశము. అనివార్యమనుకొనిలేచి దైవసంకీర్తనము చేయుచుఁ బాలముల వెంటఁ బడిపోవుచున్నది.

ఆమె పాటవిని గోవులనుఁగాచు గోపబాలకులు మిక్కలి ఆతురతతోఁ బరుగెత్తుకొనివచ్చిరి. మీరా వారినిఁజూచి "పుత్త్రి లారా! నాకు గోకులబృందావనమునకు దారిఁజూపెదరా శ్రీకృష్ణ

మందిరమున కేదిదారి? వారు ఆవులపాలుపిండి యామెకుఁ ద్రావనిచ్చి అమ్మా! అమ్మా! యనుచు బృందావనమునకు దారి చూపుచుండిరి. మీరా హరి! హరి! యనుచు శ్రీకృష్ణుని దివ్యసంకీర్తనము చేయుచుఁ బోవుచుండెను. ఆపాట విని పల్లెలలోనిప్రజలు పొలములలోనిపశువులు నామెవెంటఁ జెవులునిక్కించి యాధ్వనిపోయిన దిక్కుమొగమై చనుచుండెను. ఏమాగానమధురిమ! దివ్యగానము. అపరూపము శ్రుతిరంజకమేగాదు. మనోరంజకము అని అచ్చటచ్చటి సాహిత్యపరులనుకొనుచు నామధురిమను శక్తికొలఁది ధారణజేయుచుండిరి. ఆమె పోవుచుండెను. ఆమెరాగమాలాపించి హరియనునప్పుడెల్ల వేలకొలఁది జనులు "హరిహరి"యని భూమ్యాకాశము బ్రద్దలగునట్లు లరచుచుందురు. కొందఱు తమ భక్తికొలఁది యుపాయనములర్పింతురు. ఆమెకవియేల? దివ్యతేజముచేఁ బవిత్రీభూతమైన యామెకుఁ గొంతు యిఁకెక్కడిది. కొంద ఱామెతో ప్రయాణమై వచ్చుచుండిరి. వలదు వలదనిన విడిచిపోఁజాలమందురు. ఆమె బృందావనము చేరునప్పటికి కైలాసమందలి పార్వతీదేవి తనయూవత్తు పరిఛవముతో వచ్చినదా యనిపించెను. ఇదివఱకేమీరా సంకీర్తనములచే గోపాలుని సేవించువారలకు మీరా బృందావనమునకు వచ్చెనని తెలియుట తడవుగాఁ దండోపతండములుగా జనులామహాభక్తురాలినిఁ జూడవచ్చిరి. ఆమెను సందర్శించిరి. ఆమె యిప్పుడు మీవారు రాణీగాదు. పసపుగుడ్డలుధరించిన మహాసాధ్వి. దైవసందేశమును వ్యాపింపజేయు దేవదూతిక. ఆచిన్న మీవారురాజ్యమామె విశాలహృదయ పరిపాలనమునకుఁ జాలలేదు. విశాలవిశ్వరాజ్యమును పరిపాలించుచున్నది. చిన్నరాణిగానుండినప్పుడిచ్చిన యశాశ్వతపు టుపకరలా యిప్పుడామె ప్రసాదించునది. శాశ్వతమోక్షమార్గము. మహా

సాధ్విబృందావనమునగున్నది. బృందావనముననున్నాఁడు రూప గోసాయి. ఆగోసాయి సాక్షాత్తు చతురాననుఁడు. మహాతపశ్శాలి. కఠిననియమబద్ధచిత్తుఁడు. మోక్షకామి ధనము స్త్రీవదనము చూడరాదను కఠిననియమ మెల్లవేళల పాటించుచు శ్రీకృష్ణపరమాత్ముని సేవించుచున్నవాఁడు.

మీరా యీవార్తవిని బృందావనములో నొక్కడేపురుషుఁడున్నాఁడు. అతఁడు శ్రీకృష్ణుఁడు తక్కినవా రలందఱాతని యనురాగరసమున జీవించుగోపికలు రూపగోసాయి యీతత్త్వము నారయవలయును. రూపగోసాయి దొంగతనముగా ప్రవేశించిన గోపికాయుతమగు మందిరమున నిప్పుడైన దక్షిణమున విడిచిపోవలయును. లేదా శ్రీకృష్ణమహారాజామందిరమున నుండనిండు" అని వ్రాసిపంపెను.

ఇది చూచి రూపగోసాయి యీసాధ్విలలామ మహాభక్తురాలని తెలిసికొని యామెను దనమందిరమునకు రప్పించుకొనెను.

మీరా ఆగోసాయి పాదపద్మములకు నమస్కరించి దీవన నపేక్షించెను. గోసాయి "అమ్మాయి నేనేమిచేయఁగలను" అని యనఁగఁగా మీరాబాయి నేనునీకడనుండి దైవవాక్యలను వినని మ్మనెను.

ఆమె బృందావనదేవాలయమందే నివసించియుండెను. రూపగోసాయి ఆమెశిష్యుఁడాయెను. మీరాతాను గోసాయి శిష్యురాలననును.

ఇట్లు కాలము కొంతగడచెను. ఆమెసంకీర్తనముల గాన మధురిమ యందు వెదజల్లఁబడు శ్రీహరికరుణ అవికరిగించు నాత్మానందము వానివలనఁగలుగు త్యాగము క్రమముగా బృందావన మంతయు నిండిననిమ్మట దేశమంతయు వ్యాపించెను. సింధులో

యములపైఁబడి హిమాలయముదాఁటి బ్రహ్మదేశమునకు వ్యాపించెను. శబ్దవ్యాప్తి నాఁపగలవాఁడెవ్వఁడు. ఏరాజశాసనము దానినడ్డఁగలదు? బ్రహ్మదేశముదాఁటి క్షీరసాగరమున సౌఖశాయనికుఁడైన శ్రీకృష్ణునికి వినిపించెను. ఔరా! మీరా! భక్తిప్రభ.

---

# మీ రా బా యి .

## ఐదవ ప్రకరణము.

రాజపుత్రస్థానములోని చిన్నచిత్తూరునకది వ్యాపింపదా? వ్యాపించినది. అచటివారదివరకే మీరాదివ్యసంకీర్తనములఁ జవి యెఱిఁగియున్నవారగుట నితరులకంటె నధికభక్తియుక్తులతో నా మోసంకీర్తనాసందేశమును శిరమున వహించిరి.

రాజకుమారరాణా యెటుదిరిగిన నెచ్చటికేఁగినను మీరాసంకీర్తనములే ప్రతిధ్వనించెను. ఈశబ్దపరంపర యాతనియందు సంచలనమును గలిగించెను. సంచలనముచేఁ గలఁతనొందిన మనస్సునకందలి యుద్భోధభావములు ప్రబోధములాయెను. రాణాసాహితీపరుఁడు రసభావానుభవజ్ఞుఁడు విజ్ఞుఁడుగదా! ఆనాఁటికంటె నా నాఁడీసంకీర్తనాసందేశములు మెండయ్యెను. రాణాకింక నిశ్చలతయెక్కడిది! మీరా క్షణికమగు నాకీశరాజ్యమునువిడిచి శాశ్వతమగు పరమరాజ్యమున నభిషిక్తయైనది. రాణా యామెనువిడిచిపెట్టెను. పరపురుషకరస్పర్శవలనఁ దమవంశప్రతిష్ఠ కళంకితమగునని భయపడి

మరణదండన విధించెను. ఇదియు జనాపవాదభయమువల్లనే నొనర్చెను. కాని విచారింపఁగా నామె మీరావారు వంశకీర్తికిఁ గళంక పఱచలేదు. మీరావారువంశమునకాచంద్రతారమగు కీర్తిని బ్రతిష్ఠించెను. ప్రపంచమంతయు నామెను గొనియాడుచున్నది. రాణాకును ఆమెయందనురాగము పోలేదు. లోకాపవాదభీతుఁడగు రాణా డోలాయమానమానసుఁడై యేమిచేసెను. నిశీధసమయమున మారువేసమునసూరువిడిచి మీరా గానమధురిమచే బ్రతిధ్వనితమై యావద్భక్త్యనురాగరక్తిచే వాలి ప్రజలనైరాగ్యమునుగాంచుచు మీరాదర్శనలాలసుఁడై బృందావనమును జేరెను.

మీరా యేమిచేయుచున్నది? దేవాలయపుమెట్లమీఁద గూరుచున్నది. వాడిపోయిన తామరమొగ్గవలె నున్నది. కాని ఆమె పెదవినలంకరించిన చిదానందమును రాణా యెఱుఁగును.

రాణా మీరాయెదుటఁబడి భిక్షమడిగెను. నేను భిక్షురాలను. నీధనవంతులకడకుఁ బోయి యడుగుమని మీరాయనెను. నాతఁడు "సత్యమైన భిక్షుకుఁడు భిక్షుకునిదగ్గరకే భిక్షమడుగవచ్చు న" నెను.

"అయితే నేనేమీయగలనని మీరాయనెను.

"క్షమాపణ" మని రాణా వెరాఁకారించి నిలుచుండి వినమ్రుఁడై యడిగెను.

మీరా స్త్రీకదా! పతికాళ్ళపైఁబడి

"ప్రియా నన్ను జ్ఞాపకముంచుకొంటిరా యనెను.

వారి సమాగమ మత్యంతశోభాయమానముగనా రాణా యామెను రాణిగా మీరావారునకుఁ దోడ్కొనివచ్చెను. రాజపుత్రులెల్లరు నివ్వెఱలుపట్టిరి. మీరా తనను వత్సరమున కారు మాసములు బృందావనమున నుండనీయఁ గోరెను. ఆమెకోర్కె

కష్టముగలదా. ఆమెదాంపత్యమును యథావిధిగా నిర్వర్తించుచు దైవధ్యానముచేఁ దపస్సుచేయుచుండెను.

ఆమెసందేశమేమి? స్నానము ముక్తినిచ్చుపక్షమున చేఁపలు లేవా నీటనుండునవి?

శాకాహారము ముక్తియనిన కోఁతులు పక్షులుఁ మాటేమి.

ఆకు గడ్డి తినుట ముక్తియనిన మేకలు లేళ్లు చాలఁగలవు గదా.

ఇవిగావు ముక్తిమార్గములు. శ్రీహరియందలి యవ్యాజానురాగమే.

ఇట్టినీతు లనేకములామె యుపదేశించెను. ఆమెను జూచినవారందఱు కైలాసపర్వతమునుండియే తెంచిన పార్వతియని యనుకొనుచుండిరి. ఇప్పటికి హిందూదేశమున నిట్టిసాధ్వీలలామలు పెక్కురుగలరు.

ఓంతత్సత్.

